# జమీన్ రైతు

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 41
10-10-1986
శుక్రవారం
14 పైసలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి


# మళ్లీ మంత్రుల అసమ్మతి- చెలిమికి ఉపేంద్ర సమ్మతి?

మంత్రిమండలిలో అసమ్మతి అన్నది ఎన్టీఆర్ ముఖ్యమంత్రి అయిన నాటి నుంచి విన్పిస్తున్న వార్తే. అయితే అది ఇప్పటివరకు ఒక నిర్దిష్టరూపం సంతరించుకోవడం జరగలేదు; నా రెండు దశాబ్దాల చరిత్రలో తప్ప సఫలీకృతమైన సార్వత్రిక ఐక్యత లేదు. అయినా ఎప్పటి కప్పుడు ఆ ప్రయత్నాలు జరగడం మామూలే!

ఇప్పుడు రాజధానిలో అటువంటిదే మరొక తాజా ప్రయత్నం మొదలైంది; దీనికి ప్రేరకుడు, ప్రోత్సాహకుడు, నాయకుడు శ్రీ జానారెడ్డి. తెలుగుదేశం మంత్రులలో పరిపాలనాదక్షత, జనాకర్షణ, అధికారులపై అదుపు ఎవరికైనా వున్నాయా అంటే- అది జానారెడ్డి కొక్కడికే! ఎంతో అనుభవం, రాజకీయ పరిజ్ఞానం కల్గిన రెవిన్యూమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి ఆఫీసుకూడా నిర్మానుష్యంగా వాపురుమంటుంటుంది కాని, జానారెడ్డి కార్యాలయంలో ఎప్పుడూ కిటకిటే! కొందరు జూనియర్ మంత్రులకు అధికార్లు మాటవినకుంటే ఆయన అదుకుంటుంటారు కూడా.

వ్యక్తిత్వం కల్గినవారు కాబట్టి, జానారెడ్డి ఎన్టీఆర్ మంత్రివర్గంలో మొదటి నుంచీ ఇమడలేకపోతున్నారు. క్యాబినెట్

మా హైదరాబాదు ప్రతినిధి

సమావేశాలలో, బయటకూడా తన నిర్ణయాలను ప్రశ్నించే ధైర్యం ప్రదర్శిస్తున్న జానారెడ్డిని వదిలించుకోవాలనే ఆలోచన ఎన్టీఆర్‌లోకూడా చాలాకాలం నుంచి వుంది.

ముఖ్యమంత్రికి ఒక్క జానారెడ్డే కాదు- ఎస్. రామచంద్రారెడ్డి కె.ఇ.కృష్ణమూర్తి ఇత్యాదులపైకూడా సదభిప్రాయం లేదు. అకస్మాత్తుగా మంత్రులపై అవినీతి నిరోధకశాఖ దర్యాప్తుకు ఆదేశించడంలోనే ఆయన తన అభిప్రాయాన్ని పరోక్షంగా వ్యక్తం చేశారు. మంత్రిమండలిలో మార్పులంటూ జరిగితే వీరి కొనసాగింపు సందేహాస్పదమే!

జానారెడ్డికి కూడా, తమకే క్షణంలోనైనా ముప్పు ముంచుకుని రావచ్చునన్న విషయం తెలుసు. అందువల్ల తమకు ఉద్వాసన చెప్పడమంటూ జరిగితే బలప్రదర్శనచేసి; బెదురు పుట్టించి, వీరోచితంగా మంత్రిత్వాలు వదులుకొని, ప్రజలలో పార్టీలో సంచలనం సృష్టించాలని

-కొరవ 6వ పేజీలో



పరుగులరాణి పి.టి.ఉషను దేశం యావత్తు బ్రహ్మరథం పట్టింది; ప్రభుత్వాలే పోటీలు పడి అవార్డులిచ్చి ఊరేగిస్తున్నాయి; కనక వర్షం కురిపిస్తున్నాయి.

పదవ ఆసియాడ్‌లో, ప్రపంచం ముందు భారతదేశం ప్రతిష్ఠ పాతాళానికి దిగజారిపోయే సమయంలో పరుగు తురంగంలా క్రీడారంగంలోకి దుమికి బంగారు పతకాలు ఐదును గెల్చిన పి.టి.ఉషకు ఈ సత్కారాలు ఎక్కువేమీ కాదు; పైపెచ్చు ఆమె వల్ల దేశానికి లభించిన కీర్తికిరీటం

# స్వర్ణహారిణి పిటి ఉష

ధగధగలముందు, ఆమెకు దేశం అందిస్తున్న సన్మాన పరంపరలు వెలవెలపోతున్నాయనడం సత్యం కాని వాస్తవం.

ఉషే లేకుంటే, ఆసియా క్రీడోత్సవ పతకాల జాబితాలో ఇండియా ఎక్కడుండేది? ఎక్కడో శ్రీలంకవంటి అతిచిన్న దేశాల చాటుమాటున, సిగ్గుతో తల నేలవాల్చి నిలబడి వుండాల్సివచ్చేది; భారత క్రీడాకారులు ఆడిన ప్రతి ఆటలోనూ అత

-కొరవ 6వ పేజీలో

# జమీన్‌రైతు

## అనుక్షణం కలవరం!

ఏ క్షణంలో ఏ దుర్వార్త వినవలసివస్తుందోనని భారత జాతికి అనుక్షణం కలవరమైపోతున్నది; అదే ఆలాపనగా వుంటున్నది. శిక్కు ఉగ్రవాదుల హత్యాకాండ ఇట్టనే కొనసాగవలసిందేనా? వారి అత్యాచారాలకు అదుపు ఆజ్ఞ లేదా? ప్రియతములైన మన నాయకుల, అమాయక ప్రజల ప్రాణాలను రక్షించుకోలేని నిస్సహాయ స్థితిలో మనం వున్నామా? మన ఇంటెలిజెన్సు శాఖ, ప్రత్యేక రక్షణ దళాలు పరమదండగేనా? పరిస్థితి తలచుకుంటే గుండెచెరైపోతున్నది!

గాంధీజీ జయంతిరోజు, శాంత్యహింసలకు సర్వమత సహనానికి ప్రాణత్యాగంచేసిన మహాత్ముని సమాధి సన్నిధిలో ప్రధాని రాజీవ్ గాంధీమీద కాల్పులా? ఆయన తల్లినేకాక ఆయన్నుకూడా పొట్టనపెట్టుకోడానికి ప్రయత్నమా? పంజాబులో శాంతిభద్రతలు కాపాడడానికి, ఉగ్రవాదులనుండి అమాయకుల ప్రాణాలు రక్షించడానికి ప్రత్యేకంగా నియమించబడిన పోలీస్ ప్రధానాధికారి రిబెరోను తుదముట్టించడానికి జలంధర్‌లో అనుమతిలేనిదే చీమ సైతం ప్రవేశించడానికి వీలులేని రక్షిత ప్రదేశంలో ప్రొద్దుపొడిచీ పొడవకముందే ప్రయత్నమా? పంజాబులో ప్రతినిత్యం ఎక్కడో ఒకచోట ఒకరో ఇద్దరో హతంగావింపబడుతున్నారు; హతులలో కాంగ్రెస్, కమ్యూనిస్టు, బి జె. పి.... వగైరాపార్టీలకు చెందినవారు, ఆ పార్టీ అభిమానులు వున్నారు. చిన్నమొదలు పెద్దవరకు ప్రభుత్వోద్యోగులు, ముఖ్యంగా పోలిస్‌అధికార్లు నిట్టనిలువున పిట్టలవలెచంపబడుతున్నారు. ఉగ్రవాదులను ఏరిపారేస్తున్నామంటున్నారు; ప్రక్కనే వారి కాల్పులకు నిత్యం ఎందరో నేలకొరుగుతున్నారు!

పంజాబ్ పరిస్థితిలో మార్పులేదనికాదు; ఉగ్రవాదాన్ని అణచడానికి రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు ఎప్పటికప్పుడు తగినచర్యలు తీసుకోవడంలేదనికాదు; ముఖ్యులకు అవసరమైన రక్షణ కల్పించబడడంలేదనికాదు.. కాని ఎన్నిచర్యలు తీసుకోబడుతున్నా, ఎన్ని మార్పులు గావింపబడుతున్నా, ఎందరి బాధ్యతలు మార్చబడుతున్నా శిక్కు ఉగ్రవాదులు తాము చంపదలచుకున్నవారిని దేశంలో ఎక్కడున్నా చెప్పిచెప్పి చంపగలుగుతున్నారు.

ఎంత కట్టుదిట్టమైన భద్రతాచర్యలు తీసుకున్నా శిక్కు వుగ్రవాదుల హత్యాకాండ కొనసాగుతున్నదంటే, వ్రేళ్ళమీద లెక్కించదగిన ఆ హంతకులు ఇంత పెద్ద ప్రభుత్వాన్ని తొడకట్టి సవాల్ చేస్తున్నారనే అనుకోవాలి; దాని శక్తిసామర్థ్యాలకు పరీక్ష పెడుతున్నారనే భావించాలి! వారికి శిక్షణ పాకిస్థాన్‌లో జరుగుతుండవచ్చు. కాని వారి కార్యకలాపాలకు దేశంలోకూడా ఎక్కడో బలం చిక్కుతున్నది. ఎవరి అండో దొరుకుతున్నది; ఎవరి సహాయ సహకారాలో లభ్యమవుతున్నవి. వారికి సహకరిస్తున్నవారు, వారికార్యకలాపాలకు దోహదంకల్పిస్తున్నవారు ఖలిస్థాన్ వాదులుకాదు; దాని వ్యతిరేకులమని చెప్పుకుంటున్నవారే దేశసమగ్రతను కోరుకుంటున్నట్లు ప్రకటించుకుంటున్నవారే, మన హితులుగా ఆంతరంగికులుగా మసలుతున్నవారుగానే వుండాలి. అటువంటివారు రాజకీయవాదులు కావచ్చు. వున్నతాధికార్లు కావచ్చు. భద్రతాదళానికి చెందినవారు కావచ్చు. పోలిస్‌శాఖలో చోటుచేసుకున్న ద్రోహులుకావచ్చు. అటువంటివారిని మన ఇంటెలిజన్సుశాఖ పసికట్టలేక పోయినందువల్ల; ప్రజలు సహకరించనందువల్లనే వుగ్రవాదుల ఆటలు సాగుతున్నాయి. మన ఇంటెలిజన్సుశాఖ సమర్థవంతమైనదైతే, శిక్కు వుగ్రవాదం ఈపాటికి అదుపులోకి వచ్చివుండాలి; ఇందిరాగాంధీ మొదలు జనరల్ వైద్య వరకు కొన్ని వందల వేల విలువైన ప్రాణాలు కాపాడబడివుండాలి!

రాజీవ్‌గాంధీమీద హత్యాప్రయత్నం జరిగినతర్వాత కఠినమైన భద్రతాఏర్పాట్లకు ఆలోచన జరుగుతున్నది. అవైనా సక్రమంగా అమలుజరిగి సత్ఫలితాలివ్వాలని ఆశిద్దాం. వీటికితోడు పంజాబులో అకాలీదళ్ ప్రభుత్వంగాని, బాదల్ వర్గ కార్యకలాపాలుగాని వుగ్రవాదులను అణచడంలో ప్రతిబంధకంగాలేవా అనే సమస్యకూడా పరిశీలించతగివుంటుంది ఏమైనా శిక్కు వుగ్రవాదుల హత్యాకాండను జాతి ఒక్కటై ఎదుర్కోవాలి; దాన్ని తుదముట్టించాలి. లేకుంటే దేశభద్రత, సమగ్రత ప్రమాదంలో పడిపోతాయి!

## జమీన్‌రైతు

9 10 1936

### జవహర్లాల్ గారు నెల్లూరు వస్తున్నారు

అక్టోబరు 18 తేది ఆదివారం 7½ గం||కు మద్రాసునుండి గ్రాండు ట్రంకు ఎక్స్‌ప్రెస్‌లో బైలుదేరెదరు.

తే 18 ది

నాయుడుపేటలో ఉ. 10½ గం||కు నథ. వెంకటగిరిలో ఉ. 11½ గ||కు నథ. భోజనం, విశ్రాంతి. గూడూరులో మ|| 3 గం||కు నథ. నెల్లూరులో సా. 4½ గం||కు నథ. బుచ్చిరెడ్డిపాలెంలో సా. 6 గం||కు నథ. అల్లూరులో రా. 7½ గ||కు నథ. కావలిలో రా. 8½ గం||కు నథ. భోజనం, విశ్రాంతి.

నెల్లూరు : ఇన్స్‌పెక్టర్‌పై కేసు ... ఎస్ ... ఎక్స్‌ప్రెస్ బండిలో పోవుచుండిన జవహర్‌లాల్‌గారిని చూచుటకు ప్లాట్‌ఫారము టిక్కట్ కొని పోవుచుండగా పోలీసువారు అడ్డగించిరనియు, అందుకు ... పించగా సబ్ ఇన్స్‌పెక్టర్ అరెస్ట్

### 50 ఏళ్ల క్రితం ఈవారం

చేయించి సాయంత్రం 6 గం|| వరకు లాకప్‌లో యుంచెననియు, తన్ను అసంబద్ధముగా మాట్లాడి, తనపై న్యూసెన్సు కేసు పెట్టించెనని సబ్ ఇన్స్‌పెక్టర్‌పై క్రిమినల్ కేసు ... గారు కోర్టులో దాఖలుచేసిరి.

నెల్లూరు వార్తలు

నెల్లూరు మునసబుకోర్టులో 7 తేది రాత్రి దొంగలుబడ్డారు; సొత్తులు పోలేదు.

... నిర్వహించుటకు ... బలరామరెడ్డిగారు ... 18 తేది విడుదలౌతారు.

కాలేజి విద్యార్థులు (వి ఆర్ కాలేజి) 2 తేది గాంధీ జయంతినాడు సమ్మెచేసినందుకు ప్రతివిధానంగా కాలేజి 7 తేది లోపల స్కూళ్ళ జీతాలు కట్టకేరదనే మిషతో పెద్ద జుల్మానాలు విధించిరట.

సుభాసు చంద్రబోసు

సుభాసుచంద్రబోసుగారి ఆరోగ్యమును గురించి హోంమెంబరుగారు తెల్పిరి

బోసుగారు 7 పౌనులు తగ్గి మధ్యాహ్నం వేళలందు కొంత ఉష్ణత ఉంటున్నది వైద్యుల సలహాననుసరించి వారు ... వుంచుట మరల వైద్యపరీక్ష జరుగుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. ఇందుకుగాను జహుళ వారిని డల్హౌసీ లింగ్‌కు గాని, కలకత్తాకుగాని తీసుకొని రావలసియుండును.

# చెరువులు కాపాడనే చేతకాదు-ప్రాజెక్టుల గతి ఏమౌతుందో!

నెల్లూరు, కోవూరు తాలూకాలకు ప్రాణప్రదమైన కనిగిరి, సర్వేపల్లి రిజర్వాయర్లు, నెల్లూరు చెరువును కాపాడడంలో అధికారులు విఫలమౌతున్నతీరు చూస్తే కడుపు మండుతూంది. మూడు చెరువుల్లో మొలలోతుకుపైగా బురదపేరుకొనిపోయివుంది. అందువల్లే ఒకటికి రెండుసార్లు చెరువులు నిండనిదే ఆయకట్టు పొలాలలో ఒక్క పైరుకుకూడా నీళ్ళు అందడంలేదు. బురద తొలగించడమే జరిగితే, రెండు పంటలకు పుష్కలంగా, కొరతలేకుండా నీళ్ళు దొరుకుతాయి; ఇంజనీర్లకు దబ్బిచ్చి నీళ్ళుకొనుక్కోవలసినదుర్గతి రైతులకు తప్పుతుంది.

ఈ చెరువుల కట్టలు, కలుజులు, తూములు, పాతదైన కాల్వలు అధ్వాన్నమైపోయివున్నాయి. సర్వేపల్లి చెరువు కట్ట ... యితే, క్యాన్సర్ తగిలిన రోగిలాక్షీణించిపోతూంది. కట్టలు బలహీనం కావడంతో నీళ్లు పూర్తిగా నింపలేకపోతున్నారు తూములు సరిగా లేకపోవడంతో పారుదల కాల్వలకు నీళ్లెక్కడంలేదు; ఎక్కిన నీళ్ళుకూడా కాల్వల్లో పూడికవల్ల ఆయకట్టు చివరి ప్రాంతాలకు సరిగా చేరడంలేదు.

ఎప్పుడో, ట్రాక్టర్లుకూడా లేని పురాతన కాలంలో, రాజులు నిర్మించి, నిర్వహించిన చెరువులనే మన పిడబ్ల్యుడి అధికారులు కాపాడలేక పోతున్నారే-రేపు తెలుగుగంగ, సోమశిల పూర్తయితే ఈ చేతగాని ఇంజనీర్లు ఏమిచేస్తారో? సర్వేపల్లి చెరువుకట్టపై నిలబడితే, ఈ ప్రజానాయకులు, అధికార్లనుంచి భగవంతుడు మనచెరువుకు విముక్తి కల్పిస్తాడా అనిపిస్తుంది.

-ఈపూరు వెంకురెడ్డి
గడ్డూరువారిపాలెం

### రొయ్యల కాల్వ కట్టలు కాపాడండి

చిట్టమూరు మండలంలో రొయ్యల కాల్వకు పక్కనవున్న ... ఈశ్వరవాక, కోతలగుంట ఆకేటిపాడు, చిట్టమూరు గ్రామాలు ముంపుకు గురౌతున్నాయి. కొండాపురం ఆనకట్టనుండి పెళ్ళకూరువరకు రొయ్యల కాల్వకు కరకట్టలు కడితే ఈ ప్రమాదాన్ని నివారించవచ్చు రొయ్యలకాల్వనుండి చిట్టమూరు చెరువుకు పోతున్నకాల్వకు




మల్లాం చెరువు కాలువకు హెడ్‌స్లూయిస్ లేనందువల్ల పొర్లుకట్టలు తెగి, కరకట్టలకు నష్టం జరుగుతూంది. చుట్టుప్రక్కల పొలాలు ఇసుక మేటలతో నిండిపోతున్నాయి దీనివల్ల రైతులు ఎన్నో ఇబ్బందులు పడుతున్నారు.

ఇరిగేషన్ అధికారులు తక్షణం రొయ్యలకాలువకు పొర్లుకట్టలు నిర్మించి మల్లాం, చిట్టమూరు చెరువు కాలువలకు హెడ్‌స్లూయిస్ ఏర్పాటుచేయాలని కోరుతున్నాను

-మేనకూరు మురళీధర్ రెడ్డి
వైస్‌ప్రెసిడెంట్,
జిల్లా యూత్ కాంగ్రెస్ కమిటీ
ఈశ్వరవాక

### కరువురోజుల్లోనూ కరెంటు ఇక్కట్లా?

జిల్లాలో కరవుకు రైతాంగం విలవిలలాడిపోతూంది. చెరువులు, కాలువలు

-కొరవ 10 వ పేజీలో

# ముఁడు సాహిత్య సభలు

## మరుపూరువారి అభినందన సంచిక

కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డి సహస్ర చంద్రదర్శన శాంతి జరిగిన సందర్భంగా అభినందన సంచిక సభను ఈ నెల 3 తేది టౌన్‌హాలులో జరిగింది. సభకు చైతన్యభారతి ఇంజనీరింగ్ కాలేజి వ్యవస్థాపకులు, కవి, డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి అధ్యక్షత వహించారు. వర్తమాన సమాజం కార్యదర్శి శ్రీ అగస్త్యరెడ్డి వెంకరెడ్డి స్వాగతించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అభినందన సంచికను ఆవిష్కరించి, శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డికి ఎన్నదగిన బహుభాషా జ్ఞానం తెలియజేశారు. ఆయన 1,116 మాసాలు జీవిస్తారని, నెల్లూరు భాషలో గ్రాంధికం తియ్యదనం ఆయన గ్రంథాలలో కన్పిస్తుందని అన్నారు. ఆయనను పద తిక్కనగా అభివర్ణించారు.

శ్రీ గునుపాటి ఆదిశేషారెడ్డి శ్రీ మరుపూరువారిని సన్మానించారు. వేదసంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కె. ఎస్. రామానుజాచార్యులు మాట్లాడారు. శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి సభకు కృతజ్ఞతలు తెలియజేశారు. అడ్వకేట్ శ్రీ పి. వి. రమణారెడ్డి వందనాలు చెప్పారు.

## "కవితాకల్పకం" ఆవిష్కరణ

వర్తమానసమాజం ఆధ్వర్యాన డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి రచించిన 'కవితాకల్పకం' గ్రంథావిష్కరణ సభ టౌన్‌హాల్లో 4 తేది జరిగింది. సభను డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షించారు. శ్రీ అగస్త్యరెడ్డి వెంకరెడ్డి స్వాగతించారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఉండేలవారిని సన్మానిస్తూ, వందలాది సంవత్సరాల క్రిందటి 'కవితాకల్పకం' రూపంలో ఉండేల వారు గ్రంథులను సమర్పించారని; ఆ చిన్నవయస్సులోనే కవిత్వం వ్రాయడం అసాధారణ విషయమని, చేతనయస్సులో ఇంత



'కవితాకల్పకం' రచయిత
కవి- ఇంజనీరు
శ్రీ ఉండేల మాలకొండారెడ్డి

ప్రావీణ్యం సాధించినవారు అరుదని అన్నారు ఉద్యోగం చేస్తూ సారస్వత సేవ చేయడం కూడా చాలకష్టం. డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి చిన్నవయస్సులో వ్రాసిన కవిత్వాన్ని చూచి జాషువా లాంటి మహాకవులే ఆశ్చర్యపోయారు అన్నారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి.

శ్రీ మరుపూరు మాట్లాడుతూ డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి మీసాలు రాకముందే కవిత్వం వ్రాసారు. ఆయన కవితా విహంగం కపిగిరిలో ప్రారంభమై అట్లా రుతో రెక్కలు విప్పి నాట్యం చేసింది. విదేశాలకు వెళ్లివచ్చినా ఆయన కవిత్వం మానలేదు, సంస్కృతం తెలియకుండా, గురువు లేకుండా కవిత్వం వ్రాసారు. వినయం, విధేయత ఆయనలోని ప్రత్యేకత. 'చైతన్యభారతి' ఇంజనీరింగ్ కాలేజిని స్థాపించి, అభివృద్ధిచేశారు. 'చిత్రగుప్త' పత్రికలో ఆరోజుల్లోనే ఉండేల మాలకొండారెడ్డి, కవికోకిల దువ్వూరి రామిరెడ్డికి వారసుడని వ్రాశారు అన్నారు.

ఈనాటి భావకవుల్లో ఆనాటి భావకవుల్లా కవిత్వం చెప్పగల్గిన వారిలో మొదటివారు డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి అన్నారు శ్రీ స్వయంపాకుల శ్రీనివాసులు.

డాక్టర్ ఉండేల తన ఉపన్యాసంలో- ఆనాడు ఆవేశంతో నేతాజీ, వివేకానందుడు వ్రాసాను. తర్వాత ఆ కోరికతో క్రాంతిచక్రాలు, మొగిలిరేకులు, ఒడిసెలరాళ్ళు వ్రాసాను. వాటిల్లోని ప్రతి ఖండికకూ నా జీవితానికి దగ్గరి సంబంధం వుంది. చిన్నతప్పుడు గోడలమీద పద్యాలు వ్రాసేవాడిని. ఎంతోమంది చదివేవారు, ఇప్పుడు కవిత్వాన్ని ఆదరించేవారు కరువైనారు. అప్పటికప్పుడే సమస్యాపూరణం చేసేవాడ్ని. నేను వ్రాసిన 'నేతాజీ' చదివి ప్రేరితుడై తానుకవిత్వం వ్రాస్తున్నాను అన్నారు సహజకవి.

—కొరవ 11 వ పేజీలో

---

★ "వచన తిక్కన శ్రీ మరుపూరు"
—గోపాలరెడ్డిగారి బిరుదు

★ "ప్రతిఖండికకు నా జీవితానికి దగ్గర సంబంధం వుంది"
—కవితాకల్పం-ఉండేల

★ "శ్రీనాధుని కవిత్వం కమనీయం రమణీయం చిరస్మరణీయం"
—వెంకటశివయ్య

---

# రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ అంటే ఆ రోజుల్లో ఎంత హెూదా!

**అధికారి అనుభవాలు**

...

**దరిమడుగు కామయ్య**
(రిటైర్డ్ డిప్యూటీ సెక్రెటరి)

సెలవుమీద గ్రామానికి వెళ్ళినప్పుడల్లా మా పెదనాయనగారు 'ఉద్యోగము చేస్తే, రెవిన్యూ డిపార్టుమెంటులోనే చెయ్యాలిగాని నీ సెక్రటేరియట్ ఉద్యోగంలో యేముంది? రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికే యెక్కువ హోదా. అటువంటి హోదాగల ఉద్యోగమెందుకు చేయకూడదు'? అని అంటూ వుండేవారు. నాకూ నిజమే అనిపించి మా పెద్దల కోరికను తీర్చాలన్న ఉద్దేశంతో వెంటనే రెవిన్యూ పరీక్షలన్నీ చదివి, వాటిలో ఉత్తీర్ణుడనయ్యాను. రెవిన్యూబోర్డువారు సర్వే ట్రయినింగుకుగాను నన్ను ఉత్తర ఆర్కాట్ జిల్లాలోని ఆర్కాట్‌కు పంపారు. ఆర్కాట్‌లోని భోజనహోటళ్ళలో కొబ్బరి నూనె వాడుతూవుండేవారు. కొబ్బరి నూనెతో తయారు చేయబడిన వంటలు మాలో కొందరికి సరిపడక ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆఖరికి ఎలాగో ట్రయినింగు పూర్తిచేసి రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి అర్హుణ్ణయ్యాను రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ ట్రయినింగుకుగాను కృష్ణా జిల్లా కలెక్టర్ గారికి నాపేరు పంపారు. వారు విజయవాడ దగ్గర కొండపల్లెకు రెవిన్యూ ఇన్‌స్పెక్టర్‌గా నన్ను వేశారు. అప్పుడు కొండపల్లెలో ప్లేగ్ వ్యాధి ప్రబలి వుంది. ఊరంతా దరిదాపుగా నిర్మానుష్యమయింది. అక్కడ ఒకేఒక హోటలుండేది అందులో భోజనం చేస్తూ సత్రంలో బసచేస్తూ వుండేవాడ్ని. ఆ హోటల్లో కూరలన్నీ దోసకాయమయమే. దోసకాయ పచ్చడి, దోసకాయ పులుసు అంతా దోసకాయమయం! ఆ భోజనమూ, అక్కడి పరిస్థితులూ సరిపడనందున, వెంటనే జిల్లాకలెక్టర్ శ్రీ అబ్దుల్‌ఖాదర్ గారిని చూచి వారి అనుమతి తీసికొని సెలవుమీద వెళ్ళి, సెలవుల్లో మద్రాసులో ఉంటూ, నెల్లూరుజిల్లాకు మార్చవలసిందని రెవిన్యూబోర్డువారికి ఒక దరఖాస్తు పెట్టుకొన్నాను. నా కోరికను మన్నించి నన్ను నెల్లూరు జిల్లాకు మార్చిరి. అప్పుడు నెల్లూరు జిల్లా కలెక్టరాఫీసులో శ్రీ మన్మాధరావునాయుడుగారు హుజూర్ శిరస్తాదార్‌గా వుండేవారు వారిని కలిసి

—కొరవ 11 వ పేజీలో

---

# PEST CONTROL (INDIA) Pvt. LTD.,

**Regd. Office Yusuf Buildings, M. G. Road, P. B. No. 1510 BOMBAY-23**

WITH THE BEST COMPLIMENTS

రాయవరపు శంకరయ్య అండ్ సన్స్

మోడరన్ స్టోర్స్

విమల్ సిల్క్ హౌస్

పద్మిని జువెలరీ

**S. M. P. PVT. Ltd.**
Brindavanam, Nellore.
Phone : 6721



Pleased to announce their Inauguration
of a full pledged
**BASE OFFICE**
at 14/50, Kapu street. Nellore.
on 15-10-86 Monday at 10-55 A. M.

Branches all over the Country

Our professional services
**TERMITE CONTROL**
Treatment for white ants

Fumigation, Mosquisto Control
Rodent control. Ship fumigation
Garden pest control, carpet control
Weed control etc.,

A Member of National
Pest Control Association U. S. A.

Founder Member Indian
Pest control association



With the Best Compliments :

Janatha Jewellers
Mandapala veedhi Nellore.

With Best Compliments :

**J. K. REDDY**
CONTRACTORS
"PADMALAYA"
NELLORE-3.
Phone : 5377, 6377

**KALYANI FILMS**
Phone 4617
**Raghava CINE Complex (AC)**
Phone 6686
**LEELA MAHAL (AC)**
Phone 6417
**ARCHANA (AC)**
Phone 5072
**SESH MAHAL**

పోలయ్య

With the Best Compliments :

సిటీ బుక్ కాంప్లెక్స్

**Jewellery House**
Achari veedhi, Nellore.
Phone : 4266 5156

With the Best Compliments :

**MAX INTERNATIONAL INFUSIONS**
Mfg : I. V. Fluids
Narukur, Nellore Dist.

With the Best Compliments :

రావ్ అండ్ కుమార్

**Standard Packings**
Mfg : Baliss Brand Packing Materials
Madras Nellore Sivakasi
Phone : 447160 5588 1709

వర్తక ఏ. సి.

ఫోన్ : 3951

హోటల్ సింహపురి

# మంత్రుల అసమ్మతి

[మొదటిపేజీ తరువాయి]

వీరు తలపెడుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. అందుకు నాందిగా జానారెడ్డి ఇప్పటికుంచే ముఖ్యమంత్రికి దూరంగా మసలుతున్నారు. ఎన్టీఆర్ అనంతపురం జిల్లాను కరువు పర్యటనకు వెళ్తే, ఆ జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగా వుండికూడా ఆయన అటు ముఖంచూపలేదు. ప్లానింగ్ బోర్డు సమావేశానికిగూడా పోలేదు. పైపెచ్చు, ముఖ్యమంత్రి రాజధానిలో లేని మూడు రోజులూ ఆయన కార్యాలయం అసమ్మతి ఎమ్మెల్యేలతో, మంత్రులతో మూగిపోయింది.

ఢిల్లీలో తెలుగుదేశం సర్వాధినేతని ఉపేంద్రకూడా వీరితో చేతులుకలిపారన్న వదంతి నిజమేననిపిస్తోంది. ఉభయులకూ శ్రేయోభిలాషి అయిన కె. సత్యనారాయణ ఈ సమోధ్యకు సూత్రధారణ చేస్తున్నారట.

ఇంకొకప్రక్క, మంత్రుల పనితీరుపై సమీక్షచేసే బాధ్యతను ముఖ్యమంత్రి తనఅల్లుడు చంద్రబాబునాయుడుకు అప్పజెప్పడంతో, వీరికి వంటిమీద తేళ్ళు జెర్రులు ప్రాకినట్లుగా వుంది. మంత్రులు రాజ్యాంగం ప్రకారం ముఖ్యమంత్రికే బాధ్యులు. వారి ప్రమాణ స్వీకారంకూడా మంత్రివర్గ రహస్యాలను ఎవరికీ వెల్లడించకూడదనేదే! అటువంటప్పుడు మంత్రుల పనితీరును పార్టీ ప్రధాన కార్యదర్శి సమీక్ష చేయడం రాజ్యాంగ విరుద్ధమేకాదు, నైతికనియమాలకుకూడా భంగకరం! బాబుగారు తమను పిల్లిపిల్లలవలెచూసి, బెత్తం ఝళిపిస్తే ఇక తమ పదవులకు విలువేముంటుందన్నది వీరి ఆక్రోశం. ఇప్పటికే అధికారులకు మంత్రులంటే గడ్డిపోచంత విలువ లేదు. వారి ఆదేశాలను సెక్రెటేరియట్ గుమాస్తాలుకూడా లెక్కచేయడంలేదు. మంత్రి వేసిన నోట్ ఆర్డర్‌ను సెక్రెటరీలు బెత్తుబుట్ట దాఖలుచేస్తున్నారు.

అయితే మంత్రులు అసంతృప్తితో ఇప్పటికిప్పుడే ఏదో విరగబాటుచేస్తారనుకోవడం పొరపాటు. అంతటి ఆత్మస్థైర్యమూ వారిలోలేదు - వున్నా వెనుకనిల్చే ఎమ్మెల్యేలలో అసలేలేదు. అందులోనూ సాధారణంగా అసమ్మతి అంటే ముందు కన్పించే పెద్దల్లుడు వెంకటేశ్వరరావు ప్రస్తావన ఈసారి ఎక్కడా కన్పించడంలేదు. ★

## పి. టి. ఉష

(మొదటి పేజీ తరువాయి)

జయమే. ఈత, సైకిలింగ్, జిమ్నాస్టిక్స్, టెన్నిస్, వాలీబాల్ ఇత్యాదుల సంగతి సరేసరి- ఆఖరకు తిరుగులేని విజేతగా గణుతికెక్కిన హాకీలోకూడా ఇండియా పరువు పాతాళానికి దిగజారిపోయింది. సెమీ ఫైనల్స్‌లోనే దావుదెబ్బతిని వెనుదిరిగి వచ్చిందంటే, ఎంత సిగ్గుచేటు?

అసలు 1982 పోటీలస్థాయినైనా మన క్రీడాకారులు నిలబెట్టుకోలేకపోయారంటే, మన జాతి యువతరంమీ జగుల్లో బలహీనత అనేక్యాన్సర్ నిండిపోయిందనే అనుకోవాలి! కనీసం 1990 నాటికైనా మన ఆటగాళ్ళజట్టులో కనీసం పదిమంది పి.టి. ఉషలు తయారుకావాలి; అందుకు మార్గదర్శకంగా పిటి ఉషను జాతీయ సంపదగా పరిగణించి క్రీడాకారులందరికీ ఉత్తేజం కల్పించాలి. ★

## జిల్లా వార్తలు

(5 వ పేజీ తరువాయి)

### గూడూరు డి. ఆర్. డబ్ల్యు. కాలేజి వార్షికోత్సవం

గూడూరు దొడ్ల రమణమ్మ మహిళా కళాశాల వార్షికోత్సవ సభ జరిగింది. సభను కాలేజి కమిటి అధ్యక్షుడు శ్రీ ఎ. శ్యామసుందర్‌రెడ్డి అధ్యక్షించారు. శ్రీ దొడ్ల భాస్కరరెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. గూడూరు సబ్ కలెక్టర్ సతీమణి శ్రీమతి నిర్మలాపీటర్ విద్యార్థి సంఘానికి ప్రారంభోత్సవం చేసారు. శ్రీమతి దేవకీభాస్కర్‌రెడ్డి అధికమార్కులు పొందినవారికి, ఆటలపోటీల్లో గెలిచిన వారికి బహుమతులు పంచిపెట్టారు. కాలేజి ప్రిన్సిపాల్ శ్రీమతి కె. మహాలక్ష్మి నివేదిక చదివారు. విద్యార్థి సంఘ అధ్యక్షురాలు కుమారి వాసంతి స్వాగతం పలికారు.

### కోవూరు సాహిత్య సభలు

చైతన్య సాహితీ సమితి ఆధ్వర్యంలో కోవూరు శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానంలో 27, 28 తేదులలో సాహిత్య సభలు జరిగాయి. 27 తేది సభను యర్లగడ్డపాలెం ఆంధ్రాబ్యాంక్ మేనేజర్ శ్రీ భూపతిరావు అధ్యక్షించారు. శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు భాగవత ప్రాశస్త్యాన్ని గురించి మాట్లాడారు.

28 తేది సభకు శ్రీ పందాగ్నుల నరసింహశర్మ అధ్యక్షించారు. ప్రభుత్వ జూనియర్ కాలేజి హిందీపండిట్ శ్రీమతి జి. సద్యావతి రచించిన 'దానవ గాధాలహరి' కావ్యాన్ని ఆవిష్కరించారు. తర్వాత శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు భాగవతంలోని కృష్ణతత్వంను వివరించారు.

# ఎన్టీ ఆర్ నిర్ణయాలన్నీ ఇట్లనే వుంటాయి!

(మా మద్రాసు విలేఖరి)

తెలుగు చలనచిత్ర పరిశ్రమను మద్రాసునుంచి హైదరాబాదుకు తరలించే విషయంలో సలహాలిచ్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. ఇందులో దాసరి నారాయణరావు, కె. రాఘవేంద్రరావు, డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి, హీరో యు. కృష్ణంరాజు, హీరో కె. చిరంజీవి, సంగీత దర్శకుడు చక్రవర్తి, నిర్మాత డి. రామానాయుడు, నిర్మాత టి. త్రివిక్రమరావు సభ్యులు. కన్వీనరుగా హీరో మురళీమోహన్, సమన్వయకర్తగా రాష్ట్రసమాచార పౌరసంబంధాల కమిషనర్ వి. సైదులు నియమింపబడ్డారు. అక్కినేని నాగేశ్వరరావు గాని, హీరో కృష్ణగాని వారికి సన్నిహితులుగా వుండేవారినిగాని ఈ సలహా సంఘంలో నియమింపబడకపోవడం గురించి చిత్రపరిశ్రమలో పలువురు విస్మయం చెందారు. ఎందుకీ పక్షపాతం? అక్కినేనికి, కృష్ణకు హైదరాబాదులో సొంత స్టూడియోలు వున్నాయి. సాధకబాధకాలు, సమస్యలు వీళ్ళకు బాగా తెలుసు. వీళ్ళను నిర్లక్ష్యంచేయడం కేవలం ఉద్దేశ్యపూర్వకంగా జరిగినదే. ఇటువంటి సలహాసంఘంలో ఎన్. టి. ఆర్. కు సంబంధించినవారిని నియమించడంవల్ల తీసుకోబడే నిర్ణయాలు కూడా అంతంతమాత్రంగానే ఉంటాయని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. దీనిపై విసురుగా అక్కినేని ఒకచోట సభలో "నేను సజీవంగా వుండగా తెలుగు చిత్రపరిశ్రమ హైదరాబాదుకు తరలిరావడం కల్ల" అని చెప్పారుకూడా.

**అక్కినేని కృష్ణలకు సలహాసంఘంలో స్థానం లేదు!**

# "డబ్బుతో కొనలేనిది ఆరోగ్యమొక్కటే!"

**- సుహాసినికి అంజలి సలహా**

"దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనేదిమంచిపద్ధతే, అంతకని నిద్రాహారాలుమాని అహర్నిశలు పనిచేస్తూ ఆరోగ్యాన్ని పాడుచేసుకోకూడదు. ఆ తర్వాత ఎంతడబ్బున్నా దానివల్ల కొనలేనిది ఆరోగ్యమొక్కటే." అని ఇటీవల 'పున్నమి చంద్రుడు'' షూటింగ్ లో నీరసంగా కనపించిన సుహాసినికి సీనియర్ నటి అంజలీదేవి ఇచ్చిన సలహా సుహాసినికేకాక యువ నటీమణులందరికీ వర్తిస్తుంది. సుహాసిని ఇప్పుడు చాలాబిజీ తార. రాత్రిళ్లు పన్నెండు గంటలవరకు ''సంసారం ఓ చదరంగం'' చిత్రంలో నటిస్తోంది. ఉదయంపూట రెండుచిత్రాలు మరో ప్రక్క లావెక్కుతానేమో అన్న భయంతో ఉపవాసం, ఎప్పుడో ఒక రోజు సెట్ లో సొమ్మసిల్లి పడిపోవచ్చు. ఆతర్వాత కనీసం నెలరోజులపాటైనా విశ్రాంతి అవసరమవుతుంది. అప్పుడు ఎన్నోచిత్రాలు వదులుకోవలసివస్తుంది. అందుకేపరుగెత్తి పాలుత్రాగడంకన్నా నిలుచోని నీళ్ళుత్రాగడంమేలు'' అని అంజలీదేవి అనుభవపూర్వకంగా చెప్పింది.

## అక్టోబరులో ఎన్నో చిత్రాలు

అగ్రదర్శకుని ''ఉగ్రనరసింహం'' చిత్రానికి ప్రజలు ఉగ్రులయ్యారు. జయప్రద కాల్ షీట్లు ఇవ్వకపోవడంవల్ల ఆ చిత్రం అతుకుల బొంతలా తయారైందంటూ దానిపై ప్రేక్షకులు ఒక ''క్విజ్'' కూడా ఇచ్చారు దాసరి తన ''ఉదయం'' పత్రికలో అయినా ఫలితం లేకపోయింది.

ఇదిలావుండగా అక్టోబరు 2న కోదండరామిరెడ్డి దర్శకత్వం వహించిన ఒక రాధ-ఇద్దరు కృష్ణులు, రాక్షసుడు విడుదలయ్యాయి ఒకదానిలో కమలహాసన్, మరొకదానిలో చిరంజీవి హీరోలు. పదహారేళ్ళ అమ్మాయి చిత్రంకూడా అక్టోబర్ 2న విడుదలైంది.

బాలకృష్ణ ద్విపాత్రాభినయంతో అపూర్వ సహోదరులు, కృష్ణంరాజు హీరోగా తాండ్ర పాపారాయుడు; కృష్ణ హీరోగా పరశురాముడు శాంతినివాసం, నాగార్జున హీరోగా అరణ్యకాండ, భానుచందర్ హీరోగా హెచ్చరిక, రాజశేఖర్ హీరోగా దొంగబిడ్డ శోభన్ బాబు హీరోగా అడవి రాజా; అక్టోబరులోనే విడుదలకానున్నాయి ఇక డబ్బింగ్ చిత్రాలు సరే.

ఒకేనెలలో డజను చిత్రాలు విడుదలవడం తెలుగు ప్రేక్షకులకు కొత్తేమీ కాదు కాని, ప్రజలపరిస్థితినికూడా నిర్మాతలుగాని కొనుగోలుదారులుగాని గుర్తించాలి. కొన్ని ప్రాంతాలలో అతివృష్టి నంగి, మరికొన్ని ప్రాంతాలలో అనావృష్టినుంచి ప్రజలు ఇంకా తేరుకోలేదు. నిత్యావసర వస్తువుల ధరలు కాస్తోకూస్తో పెరుగుతూనేవున్నాయి. ఇన్ని బాధలతో సతమతమవుతున్న ప్రజలమీదికి ఇన్ని చిత్రాలు విసిరితే ఎన్నని చూడగలరు? తెలుగు చిత్రపరిశ్రమ కళకాకుండా, వ్యాపారం కాకుండాపోతే ఎలా?

-కొరవ 11 వ పేజీలో

సుమన్ మెడలమీద స్మిత
('ఉక్కు సంకెళ్లు'లో ఒక సన్నివేశం)

# పరువంలేని పదహారేళ్ల అమ్మాయి!

దాసరి శిష్యగణంలో ఒకరైన పి. యస్. కృష్ణమోహన్ రెడ్డి దర్శకత్వంలో వెలువడిన ఓ సాదాసీదా అనారోగ్యకరమైన (అతి) హాస్యభరితచిత్రం 'పదహారేళ్ళ అమ్మాయి'. కథాబలం, కథనబలం లేకుండా నవ్వులు పండించాలనే దర్శకుని వృధాప్రయాస ఈ చిత్రం రూపొందటానికి ప్రేరణ. సునిశిత హాస్యం అందించలేని ఈ తరహా చిత్రాలు ఎలా విసిగిస్తాయో, వెకిలిచేష్టలు వెర్రినవ్వులు వినోదం పేర ఎంత వెగటును పుట్టిస్తాయో, ఈ చిత్రం చక్కని ఉదాహరణ.

ఇలాంటి చిత్రాలకు సంభాషణలు ప్రాణంపోస్తాయి. ఆ మాటలు నవ్వుల పువ్వులు వెదజల్లి, చిత్రం ఆసక్తికరంగా నడవడానికి కారణభూతమయ్యి, ఓ తీపి గుర్తుగా మనకు మిగిలే భావన కల్గిస్తాయి కాని ఏదేం కర్మమో, చక్కని ఇతివృత్తంతోపాటు, సరససంభాషణలు కరువైన ఈ సినిమా రోతపుట్టిస్తుంది. దర్శకుని అజాగ్రత్తకు ఆనవాలుగా కన్పిస్తుంది.

**సి. నారాయణరావు**

ఓ అబ్బాయి, పదహారేళ్ళ అమ్మాయిని పెళ్ళి చేసుకోమన్న సలహా విని, కొన్ని నాటకాలు చేతబట్టుకొని 'అమ్మాయి' వేట ప్రారంభించడం, ఓ 'పాపాయి' అతని వలలో పడడం, ఆ 'పాపాయి' ముందు రకరకాలుగా

-కొరవ 11 వ పేజీలో

